# శ్రీమదర్చావతారప్రభావము

## అష్టోత్తర శతనామావళీ సహితము



: రచయిత :

శ్రీమాన్ పండిత నల్లూరి రంగాచార్యులుగారు

ప్రకాశకులు, రచయితగారి పౌత్రులు, గౌతములు

డాక్టరు నల్లూరి వేంకట సీతారామాచార్యులు

# అ ర్చా వ తా ర ప్ర భా వ ము

[పద్య కావ్యము]

అష్టోత్తర శతనామావళీ సహితము



: ర చ యి త :


శ్రీ భావనారాయణస్వామివారి అంతరంగ పురుషులు, ఆస్థాన పండితులు

ఆగమాచార్య, భిషగ్రత్న, కవీశ్వర, పౌరాణికశేఖర

శ్రీమాన్ పండిత నల్లూరి రంగాచార్యులుగారు



ప్రకాశకులు, రచయితగారి పౌత్రులు, గౌతములు

"వైఖానసాగమవాచస్పతి, వైఖానసరత్నాకర, ఆర్షవిద్యాభూషణ, కోవిద

డాక్టరు నల్లూరి వేంకట సీతారామాచార్యులు

ధాత, శ్రావణపూర్ణిమ భా వ పు రి 28-8-1996


SH



హైమోర్ధ్వ పుణ్డ్రమజ హస్తకుటమ్ సునాసమ్
మన్దస్మితమ్ మకర కుణ్డల చారుగన్డమ్
బింబాధరం బహుళ దీర్ఘ కృపాకటాక్షమ్
శ్రీవేఙ్కటేశ మజమాత్మని భావయేహమ్ ॥

ఈ గ్రంథము శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానములవారి
ఆర్థిక సహాయముతో ప్రచురించబడినది.

ఓం శ్రీయై నమః

# ప్రార్థన

భక్తవత్సలుడైన పరమాత్మ సర్వ ప్రాణికోటి రక్షణార్థమై పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారముల ధరించినారు - అర్చారూపముగా నున్న పరమాత్మ నారాధించుటకుగాను మహానుభావుని సృష్టింపవలసినదిగా బ్రహ్మనాజ్ఞాపించెను. బ్రహ్మ శ్రీమన్నారాయణుని గూర్చి వేదములను మనోఖననము చేయగా శ్రీమన్నారాయణుడే తన రూపముతో సమానముగా త్రిదండధారిగా స్వాయంభువ మన్వంతరమున యుగాదిలో శుక్లనామ సం॥ర శ్రావణ శుద్ధ పౌర్ణమి సోమవారమునాడు అవతరించిరి.

ఆ విఖనస భగవానునికి భృగు, మరీచి, అత్రి, కశ్యపాది మహర్షులు శిష్యులై భగవారాధనతోపాటు కర్షణాది ప్రతిష్ఠాంతము, నిత్యోత్సవము మొదలు సర్వ ఉత్సవముల నిర్వహణను, ప్రాయశ్చిత్త సహితముగా తెలిసికొని ఆ మహర్షులు మనకు వైఖానసాగమమును చాతుర్లక్ష గ్రంథముగా మన కనుగ్రహించిరి.

శ్రీ విఖనసులవారు సర్వులకు పవిత్రమగు స్మార్త సంస్కారములను, పుణ్య ఫలదాయకమగు యజ్ఞ యాగాదులను గూర్చి శ్రౌత భాగమును మనకందించిరి. శ్రీమదర్చావతార ప్రభావమును బాపట్ల శ్రీ భావనారాయణస్వామివారి పాదపద్మారాధన చేసికొనుచు కులదైవమున కంకితమొసంగి మూడు ఆశ్వాసముల ప్రబంధము రచించి మా తాతగారైన శ్రీ రంగాచార్యులవారు చరితార్థులైరి. వీరు దీనితోపాటు శ్రీవారి స్థల ప్రభావమును, శ్రీహరి నామ కీర్తనలు, ఎదురుకోల రాయబారము, తిరుమంగై ఆళ్వారు చరిత్రము అను గ్రంథములను కూడా రచించి స్వామి కంకిత మొనర్చిరి.

నేడు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థికసహాయముతో ఈ గ్రంథమును భక్తకోటికందించు భాగ్యము కలిగించినందుకు శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని మనసారాప్రార్థించుచున్నాను.

దీనితోపాటు పూర్వాచార్యు లనుగ్రహించిన కొన్ని ముఖ్య అష్టోత్తర శతనామావళులు, నల్గొండజిల్లా తమ్మరగ్రామ వాస్తవ్యులు

శ్రీ సీతారామస్వామివారి పాదపద్మారాధకులు, అభినవపోతన, భక్తకవి శేఖర బిరుదాంకితులైన శ్రీమాన్ పండిత నరహరిగోపాలాచార్యులవారు కూర్చియిచ్చిన శ్రీ కేశవ, జనార్దన లక్ష్మీవరాహ, రంగనాధస్వామివారి అష్టోత్తర శతనామావళులను ముద్రించుట కనుగ్రహించి నందులకు వారికి నానమస్సుమాలు అందజేయుచున్నాను.

ప్రతి సం॥ము శ్రావణపూర్ణిమకు ఒక గ్రంథమును భక్తులకంద జేయవలయునను భావనతో ఈ కృషి ప్రారంభించినాను. ఆస్తిక మహాశయులెల్లరు చేయూతనిచ్చి ప్రోత్సహించ ప్రార్థించుచున్నాను.

ఆగమ విహితముగా ఆరాధనల నందుకొనుచున్న అర్చావతార మూర్తిని, దైవాంశ సంభూతులుగా జన్మించిన ఆళ్వారాది మహనీయులు ద్రావిడ, సంస్కృత భాషలలో ప్రబంధములను, స్తోత్రములను అనుగ్రహించియున్నారు. 1974వ సం॥ వేటపాలెం వాస్తవ్యులు శ్రీమాన్ డా॥ వి. టి. శేషాచార్యులవారు ప్రచురించిన "శ్రీమద్రామానుజ ఆళ్వారుల జీవిత చరిత్రము" అను గ్రంథమందలి విషయముల నాధారముగా చేసికొని ఆళ్వారాదుల విషయము నిందు చేర్చితిని. మహనీయులు పై విషయములలో ఆధారపూర్వకముగా వివరణ లొసగిన రాబోవు ముద్రణలో చేర్చి భక్తకోటికి అందించు ప్రయత్నము చేయగలనని మనవిచేసికొనుచున్నాను.

బాపట్ల శ్రీ లక్ష్మీ ప్రెస్ అధినేతలు శ్రీ గుంటుపల్లి వీరయ్యగారు శ్రద్ధ వహించి ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగా ముద్రించి అందించినందులకు నా కృతజ్ఞతాభివందనములు.

అసక్తిగలవాడనేగాని శక్తిగలవాడనుగాను ఈనాకృషికి ప్రోత్సాహ మిచ్చిన సరసులు, రసజ్ఞులైన పెద్దలందరికి నా ధన్యవాదములు.

శ్రీ భావనారాయణస్వామివారు ఇట్టి గ్రంథములను భక్తుల కందజేయు భాగ్యమును ప్రసాదించవలసినదిగా మనసారా ప్రార్థించు చున్నాను.

ఇట్లు, బుధజనవిధేయుడు

నల్లూరి వేంకట సీతారామాచార్యులు, బాపట్ల

# శ్రీ మ ద ర్చా వ తా ర ప్ర భా వ ము

## విషయ సూచిక



....0....



గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా, కర్లపాలెంలో వేంచేసియున్న
శ్రీ జనార్ధనస్వామివారి ఉత్సవ మూర్తులు

పద్మారి శంఖ ముసలోజ్వల బాహుదండమ్
పీతామ్బరమ్ భూషణ భూషితాఙ్గమ్
శ్రీ భూసమేత మరవింద దళాయతాక్షమ్
పన్దే గదాధరమహమ్ సురబృన్దవన్ద్యమ్ ॥

## గ్రంథకర్త
## [ప్రకాశకుల పితామహులు]





శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు ✻ శ్రీమతి రత్తమ్మగారు

1852 – 1928 – 1858 – 1923

బాపట్ల

శ్రీ భావదేవపద పఙ్కజ భక్తిసాన్ద్రః
స్వాధ్యాయ వైద్య కవితాగమ శాస్త్రకేన్ద్రః
వైఖానసాన్వయ పయోనిధి పూర్ణచన్ద్రః
సత్కీర్తిమాన్ జయతిరంగ మహాకవీన్ద్రః॥

– [కరుణశ్రీ]



రచయితగారి కోడలు - కుమారుడు

[ప్రకాశకుల తల్లిదండ్రులు]



శ్రీమతి
రాఘవమ్మగారు
1891 - 1949



శ్రీమాన్ నల్లూరి
వేంకటాద్రియాచార్యులుగారు
1882 - 1956

ప్రధిత కృషియొనర్చి వైఖానసాన్వయ
ధర్మ మర్మములను తరచి యిష్ట
దైవమైన భావదేవుని సేవించి
మాన్యుడైన యట్టి ధన్యజీవి॥



రచయితగారి జ్యేష్ఠ పౌత్రులు [పత్రికాళకుల వదినె, అన్నగార్లు]



శ్రీమతి వేంకట లక్ష్మియమ్మగారు - శ్రీమాన్ వేంకటరంగాచార్యులుగారు
1913 - 1938 - 1909 - 1981

రచయితగారి కనిష్ఠ పౌత్రులు [పత్రికాళకులు]



నల్లూరి వేంకటశేషమ్మ - వేంకట సీతారామాచార్యులు

ప్రకాశకుల మేనమామలు



శ్రీమతి నారాయణం రంగనాయకమ్మగారు - వేంకటాచార్యులుగారు

---

ప్రకాశకుల అత్తమామలు



శ్రీమతి వేదగిరి సీతారావమ్మగారు - కోదండరామాచార్యులుగారు



శ్రీ వీర, భోగ, యోగ, లక్ష్మీసమేత

శ్రీ జ్వాలా నరసింహస్వామివారు

శ్రీ భావనారాయణస్వామివారి దేవస్థానం, బాపట్ల.

శ్రీమనృసింహవిభవే గరుడధ్వజాయ తాపత్రయోపశమనాయ భవౌషధాయ
తృష్ణాదివృశ్చికజలాగ్ని భుజఙ్గరోగ క్లేశవ్యయాయ హరయేగురవేనమస్తే।

శ్రీరస్తు　　　　ఓమ్ శ్రీమైనమః　　　　శుభమస్తు

    

# -: శ్రీ మదర్చావతార ప్రభావము :-

## ప్రథమాశ్వాసము



శ్రీ మత్సుందరవల్లి రాజ్యరమతో శృంగార వేషమ్ముతో
నా మోదంబున భక్త రక్షణకు తానర్చాస్వరూపంబు స
త్ప్రేమందాల్చి విశేషమై భవము శోభిల్లంగ బాపట్ల స
ద్ధాముండౌవర భావదేవుని మదిన్ ధ్యానింతు నశ్రాంతమున్.

కలుము లెప్పుడు శంకర కమలసంభ
వాది సురులకు నొసగుచు నవ్యయముగ
మొలకనవ్వులు మోమున గులుకు లక్ష్మి
చెలువమలరగ మమ్ము రక్షించుగాత.

ఘన విఘ్నాంధ దివాకరు
ననఘున్ కరుణాసముద్రు నాశ్రితభద్రున్
ఘనవిష్వక్సేనుని మది
ననయత స్మరియింతు కావ్యచతురతలుగన్.



సనియతి నాగమశాస్త్రం
బును విరచించియు స్వసూత్రమున కాద్యుండౌ
ఘనుడగు విఖనసమునివరు
మనమున నేసంస్మరింతు మరువక నెపుడున్.



మదివాల్మీకి మహర్షి ని
సదమలమతు లాంధ్రకవుల సన్నుతిజేతున్
బెదరక గుకవులనెల్లను
వదలక నిరసింతు కావ్యవంచకులగుటన్.

ఆర్యులుపొగడ నృసింహా
చార్యులు తత్సోదరుండు సమ్మతి రామా
చార్యులు సత్పండితు లా
దార్యుల గురువులను దలతు ధరనగ్రజులన్.

వ- అని యివ్విధంబున నిష్టదేవతానమస్కరణంబును సుకవి పురస్కరణంబును గుకవితిరస్కరణంబును గావించి,

శ్రీవైఖానస సత్కులాబ్ధివశరత్శీతాంశు డుద్యద్యశః
ప్రావీణ్యుండు హరిప్రియార్చనుడుదుష్పాపౌఘదూరుండు నా
నావేదస్మృతిశాస్త్రకోవిదుడు శ్రీ నల్లూరి వంశంబునం
దావిర్భావముజెందె మున్ను నరసింహాచార్యనామంబునన్.

అఘనునకు బుత్రుడై జనించెను తిరు
వేంగళాచార్యు లనంగ భువిని
బాలచంద్రునిరీతి బ్రబలుచు శాస్త్రార్థ
సార సంగ్రహముల చతురుడగుచు
నరసమాంబయనెడి నారీమణిని బెండ్లి
యాడి సుఖంబుల ననుభవించి
అగణితకీర్తిచే నతిశయిల్లుచు మది
బాయకధర్మముల్ బరగజేసి

భాసిలుచుతాను వాసిగ వాసిరెడ్డి। వేంకటాద్రిప్రభువుచేత విభవములను।
సాటిలేనట్లుగానొంది సకలజనుల। పాలిటికి కల్పభూజమై పరిఢవిల్లె.॥

ఆయనకు సుతుడు వేంక
ట్రాయాచార్యులు జనించి రాజిల్లుచు న
త్యాయతపండితకవిత సు
ధీయుతుడై జగతిబరగెస్థిరతరకీర్తిన్.

సతులలోపల బతివ్రతయు మిక్కిలిగుణ
వతియు సంతతధర్మమతియు సుజన
హితచరిత్రయు భాగ్యవతియు స్వాంతమున శ్రీ
పతి నేమరకయుండు పదతియైన
సతిజానకమ్మను హితమతి బెండ్లాడి
యతులసౌఖ్యంబుల నతిశయిల్లి
సుతునిగాంచిరి నమ్మసుజనులుపొగడంగ
ఘనత రంగాచార్యులనెడి వాని

నిపుడు శ్రీభావదేవ నీకృపలభింప। నమ్మి నేనీ ప్రబంధంబు నయతజెప్పి।
నీకునర్పణజేసెద నేర్పుతోడ। దీనిగైకొమ్ము మునిపూత దివ్యచరిత.॥




శ్రీ భావనారాయణ స్వామి వారు క్షీరవృక్షమునుండి చోళరాజునకు దర్శనమొసగుట

## షష్ఠ్యంతములు.

ఏవంవిధగుణనిధికిని
సేవకసుతచరిత సతత విస్మయవిధికిన్
భావైకబోధ పధికిని
లావణ్యరసాంబుధికిని లక్ష్మీపతికిన్.

రామునకు సకలజగదభి
రామునకు సమస్తభవవిరామునకు ఘన
శ్యామునకు మౌనిమానస
ధామునకు రమామణీహృదయరమ్యునకున్.

బృందారకవందితున కమందానందైక। భావనాతీతునకున్।
సుందరదేహావతునకు ఘన। మందరనగధీరునకు రమారమణునకున్.

బాపట్లపురనివాసున
కాపద్బాంధవున కవ్యయానందునకున్
పాపౌఘభంజనునకును
దీపితగాత్రునకు భావదేవేశునకున్.

వ- సమర్పితంబుగా నాయొనర్పంబూనిన అర్చావతార ప్రభావంబను మహాప్రబంధమునకు కథావిధానంబెట్టిదనిన,



## .: కథాప్రారంభము :.

నారదుండొకనాడు నలువసన్నిధికేగి
ప్రణుతుడై కోర్కెచే బలికెనిట్లు
ఆదినారాయణుం డర్చావతారంబు
గైకొనుటకు నేమికారణంబు?
తచ్చరిత్రము నాకు దగదెల్ప మనవుడు
వినుమవత్స! చెప్పెద వేడ్కతోడ
నామహాత్మ్యచరిత్ర మద్భుతంబై యొప్పు
దెలియజెప్పెదనీకు తేటపడగ

నిశ్చలంబుగ జిత్తమునిల్పి భక్తి! తోడనీకథ వినినను దోషహరము!
జ్ఞానవైరాగ్యసంపద గలుగుననుచు! చెప్పబూనెను నారదుచిత్తమలర.॥

సర్వలోకములకు కీడు సంభవింప
మౌనిజనములు విబుధులు మదిని భీతి
నొందినను గాంచి మ్రొక్కుచు నోమహాత్మ!
బౌద్ధపాషండమతములు బ్రబలెభువిని.

పరమాత్ముని మదిదలచక
నిరతము కుటిలస్వభావనిర్దయులగుచున్
వెరువక ధర్మము సత్యము
లరయగ విడనాడి దుర్మదాంధులగుచున్.

కరుణ యొకించుక లేకయు
దురితాంబుధిలోన మునిగి దుర్ణయులగుచున్
నరులిటు వర్తించుటచే
ధరదుర్భిక్షంబునొదవె దానమహాత్మా!

అనుచు సుపర్వాణులు పర
మునిసంఘము బలుక నేను బుద్ధినియటయో
చనజేసి దీనిదీర్పగ
వనజాక్షుడుదక్క నితరవారలకగునే!

వ- అని మనంబున వితర్కించి ఏకాంతప్రదేశంబునకున్ జని నిర్మల చిత్తుండనై యటకుశాజినంబులన్ జేసిన స్వస్తిక ప్రముఖాసనంబునన్ గూర్చుండి యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధినిష్ఠలచే రేచక పూరకకుంభక త్రివృత్ప్రాణాయామంబున ప్రాణేంద్రియ మనోబుద్ధి చిత్తంబుల నేకాగ్రంబు జేసి ప్రణవార్థప్రతిపాదకుడును, "నిష్కళంకనిరంజన నిర్వికల్పనిరాఖ్యాతశ్శుద్ధోదేవ ఏకోనారాయణః" అనెడు నారాయణోపనిషద్వాక్యార్థ సారవిచారణీయుండును, "యతోవాచోనివర్తంతే

అప్రాప్యమనసాసహ" అనెడు శ్రుత్యర్థము ననుసరించి అవాఙ్మా
నసగోచరుండును వేదాంతవేద్యుండును నగు శ్రీమన్నారాయణుని
బురుషసూక్తవిధానంబునన్ ధ్యానంబొనరింప నాభక్తవత్సలుండు"

హారకిరీట కేయూరనన్మణిమయ
కుండలసంశోభితుండు శంఖ
చక్రగదాపద్మసలలితహస్తుండు
కంకణనూపురాలంకృతుండు
మహితకాంచీకటీమండలురదాశ్రిత,
రక్షణ దక్షుండు రమ్యతనుడు
కౌస్తుభ శ్రీవత్సకమనీయసౌరభ,
గ్రైవేయవనమాలకలితవక్ష

డజుడు మహనీయ దివ్యపీతాంబరుండు
సచ్చిదానందమయుడు లక్షణయుతుండు
సతతలోకశరణ్యు డాశ్రితధనుండు
అనులసద్గుణశోభితుం డవ్యయుండు.

నిగమాగమసం వేద్యుం
డగణితభవరోగవైద్యు డాశ్రితభద్రుం
డగు సర్వసాక్షివరుడగు
భగవంతుడు నాకుగానబడె సత్కృడణన్.

వ_ ఇట్లు సాక్షాత్కరించిన నయ్యిందిరాసుందరీవదనారవింద మరంద
రసాస్వాదితాభిలాషమత్తమధుకరుండగు నప్పరమేశ్వరునకు
పునః పునః ప్రణామంబులాచరించి నిటలతటఘటితాంజలి
పుటుండనై అనేకవిధంబుల సేవించి,



వందనము దీనరక్షా।

వందనము సురారిశిక్ష। వనజదళాక్షా।

వందనము మౌనిపక్షా।

వందనము కటాక్షవీక్ష। వరగుణదక్షా।

వ.— ఏనమ్మహాత్ముని బహుప్రకారంబుల సంస్తుతించి యిట్లంటి, దేవా! నావిన్నపంబవధరింపుము. ధరాతలంబున దురాత్ములగు బౌద్ధ పాషండచార్వాక ప్రముఖ మాయావాదులు ప్రబలి జ్ఞానశూన్యులై వేదశాస్త్రపురాణాదుల యందసూయాపరులై, దయాసత్యశౌచ ధర్మంబులయం దిచ్ఛారహితులై, భగవత్సేవా పూజాదులయందు విముఖులై; యిచ్ఛాప్రవర్తనంబున వర్తిల్లుటంజేసి సకలలోకంబులకు క్షామడంబరాధి ప్రజాబాధలొదవెంగాన జగత్పీడానివారణంబొనరించి లోకంబులకు క్షేమంబొసంగి స్వల్పజ్ఞానసహితులైన మానవులకు సులభోపాయంబుగ మోక్షంబొసంగి రక్షింపుదని ప్రార్థింప నాజగద్రక్షకుండగు లక్ష్మీనారాయణుం డక్షీణ కృపాకటాక్షవీక్షణాలంకృత చక్షుండై యిట్లనియె, ఓవత్సా! "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనున్యాయంబున, ఏను పరవ్యూహ విభవాంతర్యామ్యాద్యవతారంబులన్ గైకొని దుష్టనిగ్రహశిష్ట ప్రతిపాలనంబొనరించి ధర్మంబుసంస్థాపించితిని. ఇప్పుడు లోకంబులకున్ గలిగిన క్షామోపద్రవాది ప్రజాపీడలడగించి దుష్టాచారంబుల భ్రష్టులై చెడియెడు నికృష్టమానవుల మద్దర్శన కైంకర్యాదులచే శిష్టులగుటన్‌జేసి మోక్షంబొసంగుటకు ఏనర్చావతారస్వరూపుండనై యవతరించెదంగాక యనియానతిచ్చి మరియు నిట్లనియె.—

శ్రీభూదేవీయుతముగ
నీభువి నర్చాస్వరూపమేదాల్చి లస
త్ప్రాభవమొందెద గావున
శోభితసుజ్ఞాననిపుణ సుగుణగరిష్ఠున్.

వేదవేదాంతకోవిదు విమలమతిని
సర్వశాస్త్రాగమాఢ్యుని శాంతగుణుని
యనఘచరితుని సత్యదయావిరతుని
మౌనివర్యుని సదయుని మాన్యఘనుని.

మత్పూజార్థంబిప్పుడు
సత్పురుషుని నీదుసృష్టిచతురత మెరయ
న్నుత్పత్తి జేయుమనుచు ॥
గత్పతి బల్కఁగ తదాజ్ఞగైకొని వేగన్.

వ- జ్ఞానసమాధి నియతుండనై "విష్ణుసర్వేషామధిపతిః పరమః పురాణః" అనెడు శ్రుత్యర్థస్వభావుండును సర్వదేవోత్తముండును సర్వజగత్పరిపూర్ణుండును దివ్యమంగళ విగ్రహుండును నగు శ్రీమన్నారాయణుని హృత్కమల కర్ణికా పీఠంబుననిల్పి విశేష మనోభజనంబు గావించిన.

వరవిఖనసమునీంద్రుడు
సురుచిరముగమద్భవిల్లె శోభితుడగుచున్
సురలెల్ల బుష్పవృష్టిని
గురియించిరి ఋషులకెల్ల కోరికలలరన్.

అంతటనమ్మునిచంద్రుని
సంతసమునగూడి శౌరిసన్నిధికే న
త్యంతముదంబునజని యా
కంతుజనకు దివ్యపాదకంజంబులకున్.

వ- అభివందనంబొనరించి.

భవదీయాజ్ఞ శిరంబున
సవినయముగ దాల్చి దేవసంఘముపొగడన్
భవహార మత్సదృశు మ
ద్భవమొనరించితి మహాత్మ! పరమమునీంద్రున్

అనియిట్లు విన్నవించిన
వనమాలిముదంబునొంది వాత్సల్యమునన్
ఘనుడగు విఖనసముని వరు
గనుగొని తాబల్కె వరనుకౌతుక మెసగన్.

ఓమునిసార్వభౌమ! ముదమొప్ప స్వసూత్రమొనర్చితద్విధిన్
మామకభవ్యపూజలను మాన్యతజేయ సభక్తికంబుగా
నీమహియందుగల్గు భవదీప్సితమంచునుబల్కి నమ్రుడై
మోమునసత్కరద్వయము మోడ్చినుతించిమునీంద్రుడిట్లనెన్.

నేధన్యుండ గృతార్థుడన్ తమకృపన్నిక్కంబు సద్భక్తి నా
రాధింపంగ స్వసూత్రసద్విధిని మీరర్చాస్వరూపంబు లో
కాధారంబుగ గొండుదేవ! యనినన్ హస్తస్పృశన్జేసి నీ
వాధిక్యం దవుమౌనిసంఘములయందంచున్ గృపాదృష్టిచేన్.

అనఘ! యాఘనవృత్తిచే నరయనీకు
జీవనార్థంబు మోక్షసంసిద్ధిగలుగు
వేదసమ్మత కైంకర్యవిధులొనర్చు
మగ్నిసర్చాముఖంబులనారగింతు.

నీదుసూత్రప్రవర్తకుల్ నిపుణులగుచు
ఘనతనొందెదరవని వైఖానసులని
గాన మత్పూజకిద్వాలు నేనువారి
నెల్ల కృపతోడ జూచెదనుల్లమలర.

వైఖానసమునివర్యః వినుముదెల్పెదనీకు
వివిధజనమ్ములు వేదమునను
స్వర్గకామోయజనస్సర్వమ్మునను నది
నమ్మి యగ్నిముఖంబున నమరవేల్పు
అశ్వమేధాదికంబగు యజ్ఞవితతిని
క్రమముగజేసి స్వర్గంబుజెంది
భోగంబులగమించి మోక్షమించుకలేక
వ్యర్థులయ్యెదరిది సార్థకంబు
నీదుసూత్రజ్ఞులెప్పుడు విశ్చలమతి
త్రికరణంబుగ మామకదివ్యయాజ
కత్వమున నాశరహితమౌ ఘనపదంబు
నొందెదరు నాదుకృపచేతనో మునీంద్రః
మరియును వినుమొక సరణిదెల్పెదనీకు
బౌద్ధపాషండచార్వాకజనులు
లోకంబునను దుష్టలోలురై తిరుగుచు
ధనముపార్జించు తత్పరత దుష్ట
నరులను సేవించి పరమార్థముత్యజించి
ధనమునార్జించుచు మనుచుందు
నట్టివారలనెల్లనరసి నేవంచించి
ఘోరనరకంబులగూలజేతు
నరయ నీసూత్రవర్తను లయినవాడు
వాదుకైంకర్యములనెల్ల నయతిజేసి
జనులకెల్లను మద్భక్తిసరణి దెల్పి
మత్కృపకు పాత్రులగుదురు మౌనిచంద్రః

వ- అని తావక సూత్రజ్ఞులగు వైఖానసులకు మదర్చనా విధానంబు పరమధర్మంబుగాన కైంకర్యార్థంబు మత్సాన్నిధ్యంబునకరుగు సమయంబున స్నానాదికృత్యంబులు నిర్వర్తించి కేశవాదిద్వాదశ నామంబులచే క్రమంబుగద్వాదశోర్ధ్వ పుండ్రంబులుధరించి మదాలయ ప్రదక్షిణంబొనరించి బలిపీఠంబుకడ ప్రణామంబాచరించి మత్సన్నిధికరిగి యటకూర్మాసనంబునన్ బ్రాణాయామపరుండై కూర్చుండి, గుణత్రయంబు మనోబుద్ధిచిత్తంబులు సదర్శనంబులుగావించి, మదర్పితసకలేంద్రియసర్వకర్మసంశీలురై త్వత్కృతసూత్రోక్త విధానంబుగా నన్నర్చించి; మత్ప్రసాదంబున్ భుజియించి-మత్కృపకున్ బాత్రులై భుక్తి ముక్తి ఫలప్రగ్రహులగుచు సుఖంబునొందెదరు. లోకంబున నవిద్యాపరతన్ ప్రవర్తిల్లు ముక్తిహీనులగు మానవులనెల్ల మత్సేవాకైంకర్యాది కృత్యంబులచేవారిన్ బావనులన్ గావించి మద్భక్తవరులన్‌గానొనర్చి తాము కృతార్థులయ్యెదరని పల్కి మరియు నిట్లనియె.

పూజను జెవరై నను మ
ద్యాజకులగు మీకు శక్తినర్థమొసగినన్
యీజగతి యశముగని వట
బీజమువలె గాంచగలరు పెంపున్ సొంపున్.

వ- అని యివ్విధంబున ననంతకళ్యాణగుణపరిపూర్ణుండగు శ్రీమన్నారాయణుండు కృపాకటాక్షవీక్షణామృతంబు వెల్లివిరియ నవ్విఖనసమునిపుంగవునితో నానతిచ్చెన,

అని యద్విజుడెరిగించిన
విని నారదమునివరుండు వేడ్క సుమతియై
ఘనమగు నీసుచరిత్రం
బనఘా! యావలనుదెల్పుమని యడుగుటయున్.

శ్రీకారుణ్యరసాబ్ధిపూర్ణవిలసత్ శ్రీమార్గలోకావనాః
సాకారామల నిర్వికారవరసత్పానందశశ్వత్ప్రభాః
పాకారి ప్రముఖార్చితాంఘ్రియుగః దుష్పాపౌఘసంహారణాః
శ్రీకాంతాహృదయాబ్జమత్తమధుపాః శ్రీభావనారాయణాః

శరధిసుతాలయవక్షః
పురుహూతాద్యమరరక్షః భువనాధ్యక్షః
కరిరాజవరద దక్ష
నిరుపమకరుణాకటాక్షః నీరేజాక్షః

మాలిని- సరసిజదళనేత్రాః చారులక్ష్మీకళత్రాః
వరదశుభచరిత్రాః భక్తహృత్కంజమిత్రాః
పురహరనుతపాత్రాః భూరిలావణ్యగాత్రాః
దురితలతలవిత్రాః దోఃప్రతాపైకచిత్రా ॥

గద్య

ఇతి శ్రీభావనారాయణ కృపాకలితకటాక్షవీక్షా సమాసాదితానవద్యకవిత్వ
విద్యావిరాజమాన నల్లూరివంశ పయఃపారావారరాకాసుధాకరాయమాన
గౌతమసగోత్రపవిత్ర వెంకటప్రయాచార్యపుత్ర సుకవిజనవిధేయ
రంగాచార్యనామధేయ ప్రణీతంబైన శ్రీమదర్చావతార
ప్రభావంబను మహాప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము-సంపూర్ణము.



# శ్రీమదర్చావతార ప్రభావము

## ద్వితీయాశ్వాసము

శ్రీలక్ష్మీకుచకుంకుమ
మేళనశృంగారవక్ష! మేదినిరక్షా!
బాలేందువదనకాంచన
చేలా! బాపట్లవాస చిన్మయభాసా.

అవధరింపుము పద్మసంభవుడు వేడ్క
మదినిరంజిల్లి నారదమౌనివరుని
గాంచి యిట్లనిపల్కె నాఘనమునీంద్ర
చంద్రుడంతవలికె మహేంద్రుజూచి.

వ- దేవా! భక్తిపై లక్ష్యంబెరింగింపుడని వేడిన నమ్మహాత్ముండు:-

మామకభక్తిలక్షణము మానుగ రెండువిధంబులై తగున్
భూమిని బాహ్యమంతరము ముఖ్యములందుల నొప్పుబాహ్యమున్
మోమున శ్వేతమృత్తిక ద్విపుండ్రముగాధరియించి మద్యశ్రీ
ధామమునైన చూర్ణమును దాల్చి నమన్ దగపూజజేయుటల్.

అంతరంబుననొప్పు నన్నాత్మలోన
ధ్యానవిజ్ఞానముగనిల్పి తగమనస్సు
కాయవాక్కర్మముల నొక్కటిగమజేసి
విశ్వలజ్ఞానసిద్ధిచే నిలుచుటగును.

వ- అని విభీషణుఋషితోడవ్దెల్ప నీనమ్మహాత్మునింగాంచి అంజలీపుట
విన్యస్తమస్తకుండనై యిట్లంటి.

అరయలోకమందు శుభదాకృతి శ్వేతనమృత్తికన్ సదా
ధారణజేయుమార్గమును తద్భవమాదిగ నాచరిత్రమున్
కూరిమితోడ దెల్పుమని కోరిన నత్కృపచేతనిట్లనెన్.
సారసనంభవా! వినుముజక్కగదెల్పెదనంచు ప్రేమతోన్.

మునునే శ్వేతద్వీపం
బున వనలీలావిహారమునుజేయుచు న
త్యనుపమ శ్వేతసుమృత్తిక
ఘనకుధరంబులను నచట గనుగొనివేడ్కన్.

వ. సంతతమదీయయాన సంవిధాన పాత్రుండగు వినతాపుత్రుంగని యిట్లంటి నేతద్వీపవాసులగు మదీయాంతరంగ భక్తులెల్ల మత్పాదంబుల బాహ్యాభ్యంతరంబుల సంతత ధ్యానధారణానందంబులన్ జెంది మోక్షసంసిద్ధినొందుటకు చిహ్నంబుగా నీశ్వేతమృత్తికాకుధరంబుల నెల్ల మున్మృత్పృత్తిజేసితిన్ గాన నీవిపుడీ శ్వేతమృత్తుకానగంబుల నవలీల నీమూపునన్ ధరియించి భూలోకంబున నచ్చటచ్చట విచ్చలవిడి నిక్షిప్తంబుజేయుమన మదాజ్ఞాప్రవర్తన శీలుండగు నవ్విహంగపుంగవుండవ్విధంబునన్ గొని చవిధరాతలంబున నుచితప్రదేశంబుల లీలావిలాసంబునమనిచెన్ గాననో చతురాననా। పవిత్రంబగు నాశ్వేతమృత్తిక స్వరూపసిద్ధాంత ప్రవర్తకులగు మద్భక్తజనసముదయంబులకు ధారణాయోగ్యంబై విలసిల్లెనెట్లనిన సుప్రవక్షశ్శిర ముఖమండలంబునన్ ద్వంద్వశోభితంబుగా మత్పాదద్వయాకృతిన్ వేణుపత్రాకృతిన్ కూర్పాకారంబునన్నైన నూర్ధ్వపుండ్రంబు ధరియించి తన్మధ్యంబున "నాసికాదిలలాటాంతం హరిద్రాచూర్ణమిశ్రితం" అను న్యాయంబున హరిద్రామిశ్రిత శ్రీచూర్ణధారణంబు జేసికేశవాదిద్వాదశనామంబులచే సక్రమంబుగ ద్వాదశోర్ధ్వపుండ్రంబులన్ ధరించి తులసిమాలికావిభూషితవక్షులై కరకలిత పద్మాక్షమాలాలంకృతులై జిహ్వాగ్రంబున మామక దివ్యమంత్రద్వయంబనారతంబభివర్ణించుచు మదర్చా స్వరూపంబు సేవించుచు మత్కైంకర్యాదులన్ గావించి మోక్షసంసిద్ధినొందెదరని భక్తిలక్షణంబెరింగించి తిరుమంత్రద్వయ

రహస్యార్థోపదేశంబుజేసి ధన్యులంగావించిన నమ్మునిపుంగవుం దత్యంతానందంబున నాలోకారాధ్యు ననేక విధంబుల భావించి, సేవించి కీర్తించి, షోడశోపచారంబులచే నర్చనాదికైంకర్యంబు లొనరించి యానందసాగరంబున నోలలాడుచుండ నా దేవదేవుండా సంయమీంద్రున్ జూచి, మాచే మూలమంత్రరహస్యోపదేశంబునొందితివిగాన పూర్ణవైష్ణవుండవన్ బరగినవాడవని పలికి ఏము బదరికాశ్రమంబాదిగా బుణ్యస్థలంబులయందర్చావతార స్వరూపుండనై వెంచేసెదన్ గాన నీవును శీఘ్రంబున బదరికాశ్రమంబున కరుగుమని యానతిచ్చి నమ్ముంగాంచి నీనివాసంబున కేగుమని యాజ్ఞనొసంగి తానంతర్హితుండయ్యెనంత నాఋషివర్యుడు ముదంబున బదరికావనంబునకున్ జనియె. ఏము దేవముని సంఘంబులు గొలువ మత్సదనంబున కరిగితినని పితామహుండు చతురవచన రచనావిశారదుండగు నారదునకెఱింగించి యోవత్సా! అర్చావతారంబునందు స్వయంవ్యక్త, దైవిక, సైద్ధిక మానుషంబులన నాలుగు విధంబులా యాపుణ్యస్థలంబుల నామంబులు సంక్షేపముగా నీకెఱింగించెద వినుమని యిట్లనియె.

ధర బదరికాశ్రమంబును;
వరశేషనగోత్తమంబు; వారాహంబున్
గరుడాద్రియు నారాయణ
ధరణీధరవరము మరియుతగ నైమిశమున్.

శ్రీకరమనంతశయనము
ప్రాకటసింహాచలంబు వాసవనగమున్
శ్రీకూర్మము శ్రీరంగము
నాకరమై వెలయు హరిస్వయంవ్యక్తమగున్.

ఘనమగుద్వారకాపురము కాంచిపురంబును ఖండికాపురం
బును వృషభాద్రిమారుతనుభూధరమున్ దగనశ్వతీర్థమున్
విమతసుచక్రతీర్థమును వేదపురంబును విష్ణుతీర్థమున్
అనఘచరిత్రః దైవికసమాఖ్యవహించు జగత్ప్రసిద్ధిగన్.

తామ్రపర్ణియు మధుర సత్యాచలంబు
ఘటికగిరి చిత్రకూట మిక్షువనంబు
వ్యాసతీర్థంబు పాండుపర్వతము నివియ
సైద్ధికములన నొప్పును సంయమీంద్రః

ధర నాల్గువర్ణములయం
దరయగ సద్భక్తియుక్తులైన నరులు శ్రీ
హరివిప్రతిష్ఠించిన ముని
వరః మానుషములు ననంగ భాసిలుచుండున్॥

వ- అని మరియు బదరికాశ్రమంబున సర్వాస్వరూపుండై యవతరించిన *నారాయణునకారాధ నాదికైంకర్యంబు లొనరించుచునుండు విఖనస ఋషిపాలికిభృగు, మరీచ్యత్రికశ్యపాది ఋషులేతెంచి వారికిన్ ప్రియశిష్యులై వారివలన నవ్విఖనన సూత్రంబును శ్రీవిష్ణు దివ్యాగమశాస్త్రంబును నాద్యంతంబుగా గ్రహియించి తత్సాంప్రదాయ ప్రవర్తకులగుచు కర్షణాది ప్రతిష్ఠాంతంబుమొదలర్చనాద్యుత్సవాంతంబు వరకు భృగుప్రోక్తమని, మరీచిప్రోక్తమని, అత్రిప్రోక్తమని, కశ్యపప్రోక్తమని చతుర్విధంబులుగా నవ్విఖనసఋషి ప్రతిష్ఠితంబగు దైవాగమ శాస్త్రంబనంతంబుగా రచియించి జగద్విఖ్యాతిన్వహించినవారలుగాన నాధర్మశాస్త్రంబులు వైఖానసులకనుష్ఠేయంబులయ్యెనని చెప్పిన నాదేవఋషి పుంగవుండత్యంతకుతూహలంబున

నర్చాస్వరూపుండగు భగవంతుని ప్రతిష్ఠావైభవంబును, పూజా మాహాత్మ్యంబును నిత్యసేవావ్రత మహిమంబును బ్రహ్మోత్సవ క్రమంబును సావధానంబుగా నాకెఱిగింపుమనివేడిన నాశతానందుం డిట్లనియె.

ధరను శిలాతామ్రదారువులందున
హరి దివ్యరూపంబు నమర దేవ
శాస్త్రసమ్మతముగ సౌందర్యలావణ్య
ముగ మనోహరము నింపొందదీర్చి
దివ్యాలయమునందు దేవదేవుప్రతిష్ఠ
విఖనససూత్రోక్తవిధులతోడ
పంచగవ్యక్షీరవరజలధాన్యాధి
వాసంబులన్ జేసి పారమాత్మి
కాదిహోమంబు లొనరించి యంతపీఠ
మందుమనిచి కళాన్యాసమరయజేసి
అన్నదానంబు ద్విజులకు నవ్యయముగ
జేసి యాజకులకును దక్షిణలొసంగి

ఇట్లు గర్భాలయమునందు నిందిరేశు
సుప్రతిష్ఠనావర్పించి శుద్ధమతిని
కౌతుకోత్సవబలిబేరకములనాగ
మోక్తవిధము ప్రతిష్ఠించి భక్తితోడ.

ప్రథితగోపురమంటపధ్వజమ్ములు విమా
నము బలిపీఠంబు లమరశాస్త్ర
విధమునగట్టించి వేడ్కమీర ప్రతిష్ఠ
చేయించి సత్కీర్తిజెందునట్టి

మనుజుండిహమ్మున మనునంత
కాలంబు సకలసంపదలచే సౌఖ్యమొంది
జన్మాంతమున హరిసాన్నిధ్యమునకేగి
శాశ్వతుడై యుండు సంతతంబు.

ఇట్టి మహిమాతిశయముచే నింపుమీర
నొప్పునర్చాస్వరూపుని యుచితభవ్య
భక్తి గొల్చెడివారల భాగ్యమెన్న
దర మెయనిదెల్పి వినిపల్కె తపసియంత.

ఇభవరదు। సుప్రతిష్ఠా
విభవము వినినంత నాకు వేడ్కమనమున నన్
బ్రభవించె నింక దెల్పవె।
శుభకరమగు తచ్చరిత్ర సుగుణగరిష్ఠా।

వ- అని నారదుండడిగిన చతుర్ముఖుం డిట్లనియె నోవత్సా। ఏతద్విష యంబునకొక పురాతన ఇతిహాసంబుగలదది వక్కాణించెద జక్కగ వినుమని యిట్లనియె. [బ్రహ్మాండపురాణే]

జగతిన్ కన్యాకుబ్జా
నగరంబున మెలయు నందు నయగుణశీలుం
డగు సత్యవ్రతుడను రా
జగణితధర్మాత్ముడగుచు నాపురినేలున్.

అరయనాభూపతి కాత్మజులిద్దరు
గలరందు నగ్రజుం డలఘుకీర్తి
కాముండు సద్గుణగణనీయు డార్యుండు
వివిధవిద్యల జగద్విశ్రుతుండు

గురుతరసద్ధర్మనిరతు డుత్తముఁడు శ్రీ
హరిపదభక్తి నేమరనివాఁడు
అతనిసోదరుం డరయ దురాత్ముండు
క్రూరుండు పాపుండు కుచ్ఛితుండు.

నగుచు దుర్వ్యాప్తిఁ జేముందు నతనిజాడ
జనకుఁడాగ్రహమున వాని సదనమందు
మండనీయక వెడలించి మండలాధి
పత్య మగ్రజునకుఁగట్టె ప్రకటితముగ.

వ- ఇవ్విధంబున నారాజన్యుండు సుగుణగరిష్ఠుండగు నగ్రసుతునకు
పట్టంబుగట్టి దుష్టచేష్టితుండగు కనిష్ఠపుత్రుని బురివెడలన్ గొట్టించిన,

అంతటవాఁడులేచి యవనాంతరభూములకేగి ధీరుఁడై
సంతసమొప్ప చోరజనసంఘములోపలఁజేరి పాంథులన్
బంతముమీఁదఁగొట్టి బలవంతముగా ధనమంతఁగొంచు న
త్యంతకుతూహలంబున సదా విహరించుచునుండె నంతటన్.

ఇటులఁదిరుగుచు గొన్నాళ్ళుజనినపిదప
ముదిమిచే జీర్ణదేహంబు బొదల మదిని
జింతనొందుచుఁదమపురిఁజేరనరుగ
నగ్రజుండటవేడ్కచే నతిశయిల్లి.

వారణమునెక్కి మిక్కిలి
చారుతరంబైన శ్వేతఛత్రావృతుడై
కూరిమితోడ ననత్పరి
వారముగొల్వంగ వెడలె ప్రాభవమొప్పన్.

అరీతినేగు నాతని
దూరంబునఁగాంచి మిగులదుఃఖించి మదిన్
కూరిమిచే మజ్జనకుం
డారయ నీరాజ్యభారమతనికొసగుటన్.

ఇట్టివిభవంబుగలిగెనేయితనికనుచు
మదినిగుందుచు తనజన్మమిదియటంచు
బుద్ధియందునవనిటు దలపోసి పోసి
విధినిదూరుచు నీరీతి వివశుడగుచు.

వ- "లలాటలిఖితారేఖాపరిమార్ష్టుంనశక్యతే" అనున్యాయంబున నొసటి వ్రాలిటులుండ నగవన్ ప్రయోజనంబేమి యని మదినిశ్చయించి యచటివారలన్‌గాంచి యిట్లనియె.

ఆరాజెచటికేగుననిపల్కఁ దత్పురి
జనముభక్తిజూపి శ్రద్ధతోడ
గాంచి యారాజశేఖరుడిటు శార్ఙ్గపా
ణునియాలయంబున కనుదినంబు
దర్శనార్థంబు తద్దయునేగునని తెల్ప
విని మనంబున నతివేడ్కతోడ
దానునచ్చటికేగి తగనాహరిని ప్రీతి
దర్శించి తత్ప్రసాదముభుజించి

దీనిరక్షకుడైన యాదేవదేవు
పాదపంకజములు నమ్మి భక్తిగొల్చి
జన్మసాఫల్యమునుబొంద సమయమిదియె
యనుచు వారలతోనేగు నవసరన.ము

ద్వారమున నుండువారలు
వారించియు నవల నేగవలదని యతనిన్
దూరముగ నెడలగొట్టిన
పారంబగుదుఃఖమంది పాతకుడనిలన్.

వ- అని యిట్లు బహుప్రకారంబులన్ పగచి మరల పశ్చాత్తాపంబునొంది విశ్చయమానసుండై కొంతధనంబు సంగ్రహించి యటనొక దేవాలయంబు గట్టించి శార్ఙ్గపాణినందున్ బ్రతిష్ఠనొనర్పించి యాదేవదేవున కనేక కైంకర్యాదులొనరించి సకలోత్సవంబులన్ జేయుచు బరమభక్తుండై యుండ గొంతకాలంమున కాయుక్షీణంబయ్యెనంత నాదేవునను గ్రహంబున.

శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గధరులు
మకరకుండలసన్మణిమకుటధరులు
నైన హరిపార్శ్వచరులు విమానమపుడు
దోడుకొనిరాగ వారలతోడ నతడు

వ- పరమానందభరితుండై కోటిసూర్య ప్రభాభాసమానంబై దశదిశలు వెలుంగు నద్దివ్యవిమానంబున నత్యంతవిభవంబునన్ గూర్చుండి ఛత్రచామరాద్యలంకృతుండై దేవతలు జయజయధ్వానంబులొనరింప పునరావృత్తిరహిత శాశ్వతంబై బ్రకాశిలు పరమపదంబునకరిగెన్. కాననర్చాస్వరూపుండగు నారాయణుని సుప్రతిష్ఠావైభవ మాహాత్మ్యం బిట్టిదని వక్కాణింపనేరికి శక్యంబుగాదని చెప్పిన విని నారదుండు హరికథా శ్రవణకుతూహల మానసుండై యావలికథా వృత్తాంతం బెరిగింపుడని వేడుటయు.

## అశ్వాసాంతము

చండప్రస్ఫుటబాహుదండఘనరక్షశ్శిక్షణోద్దండ బ్ర
హ్మాండాంతః ప్రతిభాసభాసురశుభానందైక రూపావహో
ద్దండప్రక్రియమూలకారణ విశుద్ధాత్మా! శాశ్వతా!
చండాంశుప్రతిభప్రకాశ జగదీశా భావనారాయణా!

కరుణాకర! ఘనవిరజా
వరణా! దాసార్తిహరణ! భవజలనిధినం
తరణా! వరసచ్చిత్సుఖ
కరణా! దనుజమదహరణ! కవినుతచరణా!

మాలిని॥ పరమపదవిహారా! భక్తలోకోపకారా!
వరనగసమధీరా! భార్గవీచిత్తచోరా!
సురుచిరమణిహారా! శోభితామోఘశూరా!
నిరుపమగుణధారా! నీరదాకారవీరా!

### గద్య

ఇతి శ్రీభావనారాయణ కృపాలలితకటాక్షవీక్షా సమాసాదితానవద్య కవిత్వ
విద్యావిరాజమాన నల్లూరివంశ పయఃపారావారరాకా సుధాకరాయమాన
గౌతమస గోత్రపవిత్ర వెంకటాయాచార్యపుత్ర సుకవిజనవిధేయ
రంగాచార్యనామధేయ ప్రణీతంబైన శ్రీ మదర్చావతార
ప్రభావంబను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము - సంపూర్ణము.

# శ్రీమదర్చావతార ప్రభావము

## తృతీయాశ్వాసము

శ్రీ రమణీ హృదయేశ్వర!
నీరదగంభీర! సర్వనిగమాధారా!
కారుణ్యామృత పూరిత
క్షీరా! బాపట్లవాస! దివ్యవిలాసా!

అవధరింపుము కమలజోద్భవుడు దేవ
సంయమినిజూచి పల్కెను సాదరమున
విష్ణుపూజామహాత్మ్యంబు విశ్రుతముగ
జెప్పెదను వినుమా నీదుచిత్తమలర.

వ- సుదినంబున నిత్యోచితకృత్యంబులు నిర్వర్తించి భక్తిపూర్వకంబుగా

మొలక పెమ్మలగల తులసీదళంబులు
త్రిసహస్రములువేడ్క దెచ్చి మరియు
పూజార్హమగు ద్రవ్యములనెల్ల గైకొని
హరిమందిరమ్మున కరిగి యంత
యాజకుతోడెల్ప హరినిసంసేవించి
యభివందన మొనర్చి యపుడు దేవు
నకు త్రికాలసహస్రనామ పూజాదులు
జేయించి సద్భక్తిచేత తీర్థ

సుప్రసాదములనుగొని సురుచిరముగ
నిట్టులేకదినంబున నింపుతోడ
పూజచేయించు నమ్మానవుండు సకల
సంపదలచేత నిహమందు సౌఖ్యమొంది.

వ- అట్టిమహాత్మ్యండు దేహావసానసమయంబున శ్రీ విష్ణుసాయుజ్యంబు నొందున్ గాన నిందుకొక్క పురాతనేతిహాసంబు గలదది నీకెఱింగించెద సావధాన చిత్తుండవై యాకర్ణింపుము [బ్రహ్మాండ పురాణే]

ధరణీసురవరు డొక్కడు
సరసుడు ధర్మవ్రతుండు శాంతగుణుడు స
త్కరుణాకరు దమదూరుడు
స్థిరమతి యాఘమును తనదుచిత్తమలరగన్.

వేదపారగుడైన యావిప్రవరుడు
దివ్యదేశంబులను పుణ్యతీర్థములను
దర్శనాదుల భజియింపదలచి గృహము
వెడలి సేవించును వచ్చి వేడ్కమీర.

శ్రీవేంకటాద్రి నిలయుని
సేవించగ మదినిదలచి శేషనగము స
ద్భావమునవెక్కి యరుగగ
యావిధివశమునను వానికచ్చటపొదమెన్.

వ- కర్మవశంబున వాతజాడ్య గ్రస్తపాద ద్వయుండై నడువ సమర్థతలేక విస్మయ మానసుండై చింతించుచు నటవసించి మహాపాతకినగు నాకు దివ్యమంగళ విగ్రహుండగు శ్రీనివాసమూర్తిని సేవించుటయెట్లు సిద్ధించునింక నాకెట్లు బుణ్యలోకంబు గలుగునని యనేక విధంబుల బుద్ధిం దలపోయుచు నుండ నంత నచ్చోట నా దేవదేవు ననుగ్రహంబున తులసీ వనంబు గాన్పించిన నత డత్యంతామోదమ్ముంబునొంది యింక ప్రతి దినంబేను సహస్ర తులసీ దళంబులన్గోసి యావేంకటాచలపతికర్పణంబు జేయించి

గృహార్థంబ నయ్యోదననీ విశ్చయించి దివ్యతులసీ దళంబులం సంగ్రహించి యాదేవు సాన్నిధ్యమున కెల్లఁ జేరుననీ యొంపున్ చుండ దైవ వశంబున నచ్చటికొక విభునుండరుదెంచిన.

కని సంభ్రమంబు నొందుచు
వినతుండై సంస్తుతించి విమలహృదయుడై
పనయత విట్లుగ బలికెను
కనులం దానందబాష్ప కణములు దొరుగన్.

శ్రీకరంబగు తులసీ దళంబులు శ్రీని
వాసునికర్పింప వాంఛగలిగి
సంగ్రహించితి నాకు చరణసాధ్యము లేదు
గావున ద్విజవర్య! కరుణతోడ
నిదిస్వల్పధనము నీకిచ్చెద గైకొను
మీ యుపకారంబు జేయుమిప్పు
డనిన యాఘనుడిట్లు లనియె నీద్రవ్యంబు
గైకొనజేతు నిక్కార్యమేను.

గాన తులసీ దళంబులు ఘనననొసగు
శ్రీనివాసునకర్పింతు శీఘ్రముగను
ననుచు బలికిన విని యతడతనిజూచి
మరలనిట్లని పల్కెను కరుణతోడ.

వైఖానసాన్వయోద్భవ! తెల్పెదనుధర్మ
శాస్త్రరహస్యార్థసార మొకటి
స్వర్ణ భారశతంబు సమముగాదొక తుల
సీదళప్రభల విశిష్టతలకు

కాన స్వల్పధనంబు దీనిగై కొను నీకు
ఫలమనంతము విష్ణుభక్తసర్య:
చిత్తంబలర నీవుజేయుమిక్కార్యంబు
నతిశీఘ్రముగ పేదనరుగుమనుచు.

ప్రార్థనా పూర్వకంబుగ బ్రస్తుతింప
ధనము తులసీదళంబులు దయగ్రహించి
శేషనగమెక్కి యాతడా శ్రీనివాస
మూర్తి కర్పణజేసెను ముదముతోడ.

ఇటులనర్పించి యంతతానింపుమీర
స్వామిసన్నిధి తీర్థప్రసాదములను
దెచ్చి యాద్విజవర్యున కిచ్చినంత
నితడు నానందమగ్నుడై యతనిబొగడె.

వ- ఇవ్విధంబున్ గొంతకాలంబు జనినపిదప నాయిరువుర కాయుక్షీణం
బయ్యె నంత నాశ్రీనివాసమూర్తి యనుగ్రహంబున శ్రీహరిపార్శ్వ
చరులు రత్నస్థగిత ధగద్ధగాయ మానంబును శతకోటి రవిప్రభా
విభాసితంబును దేవపరివేష్టితంబునగు దివ్య విమానంబు దెచ్చి
నమస్కరించిన హరిపార్శ్వ చరులకు మ్రొక్కి విమానా రోహ
ణంబుజేసి యాదేవాధి దేవునసేక విధంబులన్ గీర్తించుచు వైకుం
ఠంబున కరిగిరిగావున సర్వాన్వరూపుండగు నారాయణుని పూజాఫలం
బిట్టిదని వక్కాణింపనేరికిని శక్యంబు గాదనిచెప్పి,

"ఫలంసమానంత ద్ధర్మేహ్యర్థోపాధిన విద్యతే"

అను బ్రహ్మాండపురాణోక్తి నా యిరువురకున్ సమాన ఫలంబగుటచే
శ్రీవిష్ణుసాన్నిధ్యంబు నొందిన వారలింక నిత్యసేవావ్రత మహిమాతి
శయంబున కొకపురాతన నేతిహాసంబు గలదు దానివి నీకెరింగించెద
వినుమని యిట్లనియె. [బ్రహ్మాండపురాణే]

మున్నొకవిప్రసద్మనకు పుత్రుఁడొకండుగలండు వానిపై
మన్ననతోడ తండ్రి గురుమందిరమందు నొప్పగించి యా
చిన్న కుమారునిన్ దనదుశిష్యునిగా గ్రహియించి శాస్త్రసం
పన్నునిజేయుడంచు దగబల్కఁగ నాగురువట్లువానికిన్.

శాస్త్రపురాణాది సకలవిద్యలనెల్ల
నతిశ్రద్ధతోఁజెప్ప నంతవాని
జన్మప్రారబ్ధవశంబున రాకునిక్కఁ
వదలె సద్గురువును వాఁడువచట
వెడలియథేచ్ఛగా విహరింప నడఁజూచి
తండ్రి యనేక విధముల నతని
కనుదినంబును బోధలను పందజెప్పియు
సరివారలనుగూర్చి మరలమరల

నాతనికిబోధజేయించి యంతమీద
విసిగివేసారి వాఁడవివేకియగుట
మంతనంబునదలపోసి మదినిరోసి
మందిరము వెడలించుట మంచిదనుచు.

ఇలువెడలగొట్టి వాఁడువె
డలి కుంభజునాశ్రమంబు దగ్గరి యటన
క్కలశజుఁగని తత్పదయుగ
జలజములకుమ్రొక్కి శరణుశరణనివేదన్.

అంతనమ్మహాత్ము డాతనిగనుగొని
యెవడవీవు నిచటికేలవచ్చి
తివి యెరుంగ నాకు వివరింపుమా! యింక
ననిన నాతడిట్టులనియె నపుడు.

వ- ఓ మహాత్మా! ఏమదాౖహ్మణండ విద్యావిహీనుండ నవుటచే మజ్జన కుండు గృహంబు వెడలగొట్టెన్ గాన వజ్ఞామండనగు నన్ను రక్షించి కృతార్థుంచేయుండని ప్రార్థించిన నయ్యగస్త్య మహామునీంద్రుండు దయార్ద్ర హృదయుండై యిట్లనియె నోవత్సా! "విద్యావిహీనః పశుః" అను న్యాయంబున విద్యలేనివాడు పశుప్రాయుండనంబడునని చెప్పి వానికుపదేశ బొసంగి యిట్లనియె,

శ్రీరంగమునకు జని నీ
వారంగని సేవ జేయుమనుచు నతడు స
త్కారుణ్యమొప్ప దెల్పిన
కూరిమి నాఘను నమ్మఙ్ఞగొని కదువేడ్కన్.

అరిగి కావేరిలో స్నానమాచరించి
నిత్యజపములు కర్మముల్ నేర్పుమీర
నలిపి నిష్ఠాగరిష్ఠుడై నంతసమున
రంగనాధుని దర్శింప రహినివెడలి.

రమణీయంబగు గోపురంబునను శ్రీరంజిల్ల పద్మేశుని భ్రమనొందించెడు ద్వారపాలకుల సద్భావంబునన్ గాంచి నం భ్రమముప్పొంగ నమస్కరించినయతన్ప్రార్థించి యాముందటన్ క్రమతన్ నద్బలిపీఠమున్ ధ్వజము శాగన్గాంచు సద్భక్తితోన్.

అంత సాష్టాంగ వందనం బాచరించి
నిటలతట ఘటితాంజలి పుటుడునై ప్ర
దక్షిణ మొనర్చి యటనన్నిధానమునకు
జనియు నాదేవదేవుదర్శనముజేసి.

వ- బహువిధంబుల స్తోత్రంబాచరించి తీర్థప్రసాదంబులన్ గ్రహించి, ఇట్లు ప్రతి దినంబు,

ఈ రీతి నిత్యసేవ స
దారూఢిగజేయ నప్పుడాహరి యాజ్ఞన్
ధారుణీపతి యాద్విజున క
పార ధనంబొసగి తావివాహ మొనర్చెన్.

వ- అంత

అత్యుత్తమ చారిత్రుడు
సత్యవ్రత భార్యతోడ సౌఖ్యోన్నతుడై
నిత్యంబగు హరికృపనన
సత్యదళంబొనరగాంచె భావమలరగన్,

పావనులగు సుతులను నా
నావేదపురాణ శాస్త్రనైపుణులుగ స
ద్ధీవడుడొనరించియు తా
నావల బెండ్లిండ్లుజేసె నా హరికృపచేన్.

పుత్రపౌత్రులతోడ ఖంపొంది రంగ
నాథుననవరతము దర్శనంబు వేడ్క
చేయ నటుముదిమియు బ్రవేశించి నేత్ర
పాటవముదప్పె నంతట బ్రాహ్మణుండు.

నిత్యసేవావ్రతనియంబు దప్పిన
మానెనంతట నన్నపానములను
నదిజూచి పుత్రపౌత్రాదులు నీవు వ
శక్తుడవౌట నద్భక్తివ్రత వి

నాశాన్నదోషోహి నాస్తినాస్తి నసంశ
యఃభుజింపుమ యిపుడన్న మీవు
ననిన రంగని తీర్థమును ప్రసాదంబును
గొనకయే భుజియించననుచు బలికె.

నంత శ్రీరంగనాయకుడర్చకుగని
యాదరణమున బలికె మాకంతరంగ
భక్తుడగు భూసురోత్తము భవనమునకు
జని యొసగిరమ్ము తీర్థప్రసాదములను.

వ- అని యివ్విధంబున భక్తార్తి భంజనుండగు నారంగనాధుండాజ్ఞ నొసంగిన నవ్వైఖానసుండవ్విధంబున నా విప్రుని సదనంబునకరిగి యాతండు ముదంబున నొసంగిన వస్త్రాభరణాదులన్ గొని పుత్రపౌత్రాది సమన్వితుండగు నాద్విజ వర్యునకు తీర్థప్రసాదంబులొసంగి యాదేవదేవు సాన్నిధ్యంబునకరిగె నట్లు గొన్నిదినంబులు జనిన పిదప నాభూసురోత్తమునకు దేహావసాన సమయంబు సంప్రాప్తంబయిన రంగేశు నమగ్రహంబున శంఖచక్రగదాద్యాయుధులును దివ్యపీతాంబరధరులును కంకణ నూపురకుండల కిరీటాద్యలంకృతులును కృపాతరంగ కల్లోల సాదరాపాంగ విలోచనులును నగు శ్రీహరిపార్శ్వచరులు దివ్యవిమానంబుదోడ్కొనివచ్చి నిత్యసేవావ్రత నియమపరుండగు నవ్విప్రోత్తముని విమానారోహణంబు జేసికొని దశదిశలు విరాజిల్ల బరమపదమున కరిగిరి. కాన సర్వాన్వరూపుండగు శ్రీవిష్ణుదేవు మహత్మ్యం బనంతంబనిచెప్పి మరల నిట్లనియె నింక బ్రహ్మోత్సవ క్రమంబెఱిగించెద వినుము.

బ్రహ్మోత్సవమునందు ప్రారంభదినమున
దీక్షాదినియమంబుదీర్చి పిదప

అంకురార్పణ పూజలాదిగా నొనరించి
యగ్నిప్రతిష్ఠాదు లరయజేసి
ధ్వజమున గద్యపద్యాది తాళములచే
గరుడపటంబును గట్టినంత
దిక్పాలులకు బలుల్ దినదిన మొసగుచు
నిత్యహోమంబులు నియతిజేసి.

భక్తి ప్రతిదిన మొక్కొక్క వాహనంబు
పైన దేవుని వేంచేపు బరగజేసి
నృత్యగీతాదివాద్యముల్ నేర్పుమీర
జెలగ బురమున మత్సవంబలరజేసి.

వ- ఇవ్విధంబునన్ బతాక ఛత్రచామరాదలం కృతంబుగా నాగమశాస్త్ర విదితంబులగు విశేషదినంబుల యందత్యంత మహద్వైభవంబుగా నవాహ్నిక, సప్తాహ్నిక, పంచాహ్నికాది సౌంజ్ఞలచే మత్సవం బొన రించుచు నవాహ్నిక బ్రహ్మోత్సవము నందు షష్ఠమదిన సాయం కాలంబున దేవదేవీ సహితంబుగా నాస్థానంబున జలకుంకుమోత్సవం బును సప్తమ దినంబున బూర్వోక్తవిధంబుగ సప్తర్షిపూజా మహో త్సవంబును, అష్టమ దినంబున వినోదోత్సవానంతరంబున తిరుక్క ళ్యాణమంటపాభ్యంతరంబున దేవదేవీఖ్యాంప హపవిశ్య విశేషోప చారయుతంబుగా నత్యంతవైభవ సహిత కళ్యాణమహోత్సవంబును నవమ దినంబున రథమహోత్సవంబును విశేషాన్నదానంబును నసం తర దినంబున తీర్థోత్సవంబాదిగా ననేక విశేషోత్సవంబులు జరుగు నిట్లు శాస్త్రవిదితంబుగా నవాహ్నికోత్సవం బత్యంత విభవంబుగా జేయించు నమ్మానవుండు నిత్యవిభూతియందత్యంత విభవంబునన్ బ్రకాశిలు నింక నీ బ్రహ్మోత్సవంబతి భక్తియుక్తి సేవించెడు

మానవులు సమస్త పాతక విదూరులై శ్రీహరిసాన్నిధ్యంబు నొందె దరని తెల్పిన విని త్రిలోక సంచారుడగు నారదుండో మహాత్మా! నామనంబు పరమానందంబు నొందె ననిన విని ఓ నారదా అష్టాదశ సూత్రములలో విఖనససూత్రి ముత్తమోత్తమ మనంబడు నదెట్లనిన అన్యసూత్రజ్ఞలందరు షోడశకర్మముల నొనర్చినవారలు విఖనసఋషి తమసూత్రము నందష్టాదశ సంస్కారములజెప్పె నంతియగాక త్రివిధచంక్రాంకణ ప్రతిపాదితంబగు శిఖాయజ్ఞోపవీత త్రిదండ సన్యాసవిధిని శ్రీవిష్ణు దివ్యాగమ శాస్త్రంబున నివిమొదలుగా ననేక విషయములొనర్చి యున్నవార లిదియునుంగాక.

"బ్రహ్మండపురాణే" అర్చకస్స హరిస్సా ఊచ్చర రూపోనసంశయ అను న్యాయంబున నవ్విఖనసఋషి భగవంతున కర్చనాద్యుప చారంబులు సమర్పించి దైవస్వరూపుడనన్ బరగినవాడు గాన తత్సూత్రజ్ఞలు వినాఅన్య సూత్రజ్ఞులు హరికర్చనాద్యుప చారంబులొనరించి రేని అట్టివారలు దేవలుక్కల నంబడుదురని యనేకశాస్త్రములయందు ప్రతిపాదింప బడియున్నది. కాన సర్వలోక పూజనీయుండవును, బ్రహ్మజ్ఞాన నిపుణుండవును, పరమభాగవత శేఖరుండవునైన నీవు వినా - ఇతరులిట్లు భగవత్కథాసంప్రశ్నంబుజేయ నోపుదురే నీవలన గదా సురముని వరసము దయంబుల కర్చావతార మహిమాతిశయంబు గరతలామలకంబుగ దెలియవచ్చెనని పలికి,

వనజోద్భవు దివ్యాధమున
ఘనమగు నర్చావతారకథ వివిపింపన్
మనమలరగవిని నారదు
దనఘా నాకోర్కె సఫలమయ్యెను స్వామీ!.

ఘనమగు నీసద్గ్రంథము
వినినన్ బఠియించిరేని వేడుకమీరన్
ఘనవైకుంఠ పురంబున
మనియెద రెల్లపుడు దివ్యమహిమాన్వితులై.

## దేవాలయ సమ్మార్జనాదుల ఫలము

"సమ్మార్జనశతంగావః సహస్రమను లేపనం
మాలాశతసహస్రాణి అనంతం దీపముచ్యతే"

## ప్రదక్షిణ క్రమము

ఏకంగణపతించైవ ద్వేసూర్యం త్రీణిశంకరం
చత్వారి కేశవంచైవ సప్తాశ్వత్థప్రదక్షిణం॥

## అహ్నికసంజ్ఞ - నవాహ్నికము

హంసః ఫణీంద్రో హనుమాన్ మృగేంద్రోతురగస్తథా
గజ పున్నాగ వృక్షౌచ గరుడశ్చ తతోరధః
ఏవమేవక్రమేణైవ నవాహ్నికముదాహృతం॥

## సప్తాహ్నికము

అనంత స్సింహ్న హంసేంద్రోభాను బింబంచపక్షి రాట్
దంతావళీ రథశ్చైవ సప్తాహ్నిక ముదాహృతం॥

## పంచాహ్నికము

ప్రథమంతుహరిం విద్యాద్ద్వితీయం మృగరాజకం
తృతీయంక పిరాజంచ చతుర్థంవీశమేవచ
పంచమంతురథంచైవ పంచాహ్నికముదాహృతం॥

## అర్చనఫలమ్

"ద్విజాతిరతన్ద్రితో నిత్యంగృహే, దేవాయతనేవా భక్త్యా
భగవన్తంనారాయణమర్చయేత్ తద్విష్ణోః పరమంపదం
గచ్ఛతీతివిజ్ఞాయతే - [ఇత్యాహ భగవాన్ విఖనాః]

## ఆశ్వాసాంతము

సర్వోత్కృష్టపదాత్మభావ విలస త్సర్వైకరూపాకరా!
పర్వేందుప్రతిభాసమాన ముఖసత్పం కేరుహాక్షద్వయా!
నిర్వాణప్రియయోగిమానస సుఖోన్మీల ప్రభావీక్షణా!
గీర్వాణైకనుతా! సమస్తగుణసాక్షీ భావనారాయణా!

శ్రీశా రంజితభోగా!
శాసితభవచావభంగ శాశ్వతధుర్యా!
యాశాపతినుతసకలా
త్మేశా! భవహరణచరణ! ఇనశశినయనా॥

కథితసుగుణజాలా! కాలమేఘాభనీలా!
విధిముఖపరిపాలా - విశ్వవిఖ్యాతశీలా!
ప్రథితకనకచేలా భక్తహృత్కంజలోలా
ఉదరధరణహేలా! గోపికాచిత్తలోలా

## గద్య

ఇతి శ్రీభావనారాయణ కృపాలలితకటాక్షవీక్షా సమాసాదితానవద్య కవిత్వ
విద్యావిరాజమాన నల్లూరివంశ పయఃపారావారరాకా సుధాకరాయమాన
గౌతమస గోత్రపవిత్ర వెంకట్రాయాచార్యపుత్ర సుకవిజనవిధేయ
రంగాచార్యనామధేయ ప్రణీతంబైన శ్రీ మదర్చావతార
ప్రభావంబను మహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము - సంపూర్ణము.

---

ఓమ్ శ్రియైనమః

# శ్రీమద్రాజ్యలక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రమ్

ఓం శ్రీగురుభ్యోనమః హరిః ఓం

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్
విఘ్నంవిఘ్నంతిసతతం విష్వక్సేనంతమాశ్రయే॥

వ్యాసంవసిష్ఠనప్తారం శక్తేఃపౌత్రమకల్మషం
పరాశరాత్మజంవన్దే శుకతాతం తపోనిధిమ్॥

వ్యాసాయవిష్ణురూపాయ వ్యాసరూపాయవిష్ణవే
నమోవైబ్రహ్మనిధయే వాసిష్ఠాయనమోనమః॥

ధ్యానమ్:-

అభయవరదహస్తాం పద్మసింహాసనస్థాం
కనకకమల యుగ్మప్రోల్లసత్పాణి పద్మాం
అణుపరిమితమధ్యాం కుంభికుంభ స్తనాఢ్యాం
పృథులజఘన శోభాంరాజ్యలక్ష్మీం నమామి.

తరుణజలజనేత్రాం తప్తగాంగేయ గాత్రాం
నిరుపమగుణశీలాం నిత్యసత్కాల వాలామ్
కలశజలధిజాతాం కామితార్థ ప్రసూతాం
రవిహిమకిరణాక్షీం రాజ్యలక్ష్మీ నమామి.

శ్లో॥ రమారాజ్యరమాచైవ రామాయణకథాప్రియా
రమణీయాన్నభోక్త్రీచ రథహస్త్యశ్వదాయినీ॥ 1
రక్షోఘ్నీరమ్యరూపాఢ్యా రాజ్యదారాజ్యవర్ధినీ
రసాధిపారోగహంత్రీ రాగదారాగభూషితా॥ 2
రసప్రదీప్తారసికా రక్షోగణవినాశినీ
రంభాదిపూజితారమ్యా రామానందప్రదాయినీ॥ 3
రత్నహారా రాజముఖిస్తుత్యా రాజీవమందిరా
రథారూఢా రాజవంద్యా రుక్మిణీ రుక్మిసోదరీ॥ 4
రత్నగర్భా రోహిణీచ రత్నకంకణధారిణీ
రత్నాకరసుతా రాజరాజసేవిత పాదుకా॥ 5
రత్నాంగీ రత్నదాత్రీచ రత్నాకరసముద్భవా
రత్నాంచితకిరీటా చరమ్యోద్యానవిహారిణీ॥ 6
రత్నాఢ్యారాగరూపాచ రాగాతీతాచరాగిణీ
రత్నామవిద్ధమాల్యాచ రత్నపర్యంకశాయినీ॥ 7
రత్నాసనతా స్థితాజరత్నస్థగితపాదుకా
రతిరాజస్తుతారమ్యా రుక్మాంగదసుపూజితా॥ 8
రణరంగప్రియారత్నదాయినీ రాక్షసీస్తుతా
రాకేందువదనా రామభక్త సౌభాగ్యదాయినీ॥ 9
రంగద్వీపపురీరమ్యా రాజదర్పాపహారిణీ
రంగదాసార్చితపదా రఘువంశకథారతా॥ 10
రంగరాజపురాంతస్థా రంగరాజసుఖప్రదా
రంగేశ్వరీరాజముఖీ రణన్నూపురభూషణా॥ 11
రాజరాజార్చితపదా రాజద్గంధేభవాహనా
రాజరాజాది సంస్తూయమానా రాజ్యప్రదాయినీ॥ 12

రాజ్యరాజేశ్వరీవంద్యా రావణ జ్ఞానబోధినీ
రాజంతీ రాజభృత్యాచ రాక్షసౌఘవినాశినీ॥ 31
రాజాత్మజా రంగరాజమహిషీ రంగనాయికా
రాజితారమణీ రామా రామచిత్తానుసారిణీ ॥ 14
రాజకర్త్రీరమ్యరూపా రమ్యపుష్పవిభూషితా
రాజ్యశ్రీరాజ్యరూపాచ రణత్కింకిణీమేఖలా॥ 15
రాజీవలోచనా రాధారాజ్ఞీరమ్యగుణాశ్రయా
రాజీవపాదా రాజీవహస్తా రాజీవధారిణీ॥ 16
రామభక్తార్చితపదా రాజన్మకుటమండితా
రామపాదాశ్రితా రామవామాంకస్థాచ రంజితా॥ 17
రామప్రియా రాజ్యలక్ష్మీ రాకాచంద్రనిభాననా
రామామణిస్తుతా రామభక్తా రమ్యవరప్రదా॥ 18
రాక్షసీరక్షణవ్యగ్రా రుద్రాణ్యాది సమర్చితా
రుద్రార్చితపదా రంగనగరాంతర్విహారిణీ॥ 19
రుద్రాదిదేవసందోహ సమర్చితపదాంబుజా
రుద్రబ్రహ్మాదిసంసేవ్యా రుక్మమాలావిభూషితా॥ 20
రోగసంఘవినిర్ముక్తా రుణాహంత్రీచ రుక్మదా
శ్రీమద్ధావపురీవాస రాజ్యలక్ష్మ్యై నమోనమః॥ 21
రాజ్యలక్ష్మ్యాః ప్రసాదేన కృతమష్టోత్తరం శతమ్
త్రిసంధ్యం జపతేయస్తు మాసమేకంనిరంతరమ్॥ 22
పుత్రాన్పౌత్రాన్ వరాన్మిత్రాన్ ధనంధాన్యంయశస్సుఖమ్
ఆయుష్యంలభతే పూర్ణమైశ్వర్యమపివాంఛితమ్॥ 23
సర్వాన్కామానవాప్నోతి శత్రూన్జయతినిస్సర్వదా
రాజ్యలక్ష్మ్యాఃప్రసాదేనహ్యంతే మోక్షమవాప్నుయాత్॥24

శ్రీ రాజ్యలక్ష్మ్యష్టోత్తరశత నామస్తోత్రమ్ సంపూర్ణమ్

# శ్రీ మద్రాజ్యలక్ష్మ్యష్టోత్తర శతనామావళిః

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఓం | రమాయై | నమః | ఓం | రాజీవమందిరాయై | నమః |
| ,, | రాజ్యరమాయై | ,, | ,, | రథారూఢాయై | ,, |
| ,, | రామాయణకథాప్రియాయై | ,, | ,, | రాజవంద్యాయై | ,, |
| ,, | రమణీయాన్నభోక్త్ర్యై | ,, | ,, | రుక్మిణ్యై | ,, |
| ,, | రథహస్త్యశ్వదాయిన్యై | ,, | ,, | రుక్మిసోదర్యై | ,, |
| ,, | రక్షోఘ్న్యై | ,, | ,, | రత్నగర్భాయై | ,, |
| ,, | రమ్యరూపాఢ్యాయై | ,, | ,, | రోహిణ్యై | ,, |
| ,, | రాజ్యదాయై | ,, | ,, | రత్నకంకణధారిణ్యై | ,, |
| ,, | రాజ్యవర్ధిన్యై | ,, | ,, | రత్నాకరసుతాయై | ,, |
| ,, | రసాధిపాయై | ,, | ,, | రాజరాజసేవితపాదుకాయై | ,, |
| ,, | రోగహంత్ర్యై | ,, | ,, | రత్నాంగ్యై | ,, |
| ,, | రాగదాయై | ,, | ,, | రత్నదాత్ర్యై | ,, |
| ,, | రాగభూషితాయై | ,, | ,, | రత్నాకరసముద్భవాయై | ,, |
| ,, | రసప్రదీప్తాయై | ,, | ,, | రత్నాంచితకిరీటాయై | ,, |
| ,, | రసికాయై | ,, | ,, | రమ్యోద్యానవిహారిణ్యై | ,, |
| ,, | రక్షోగణవినాశిన్యై | ,, | ,, | రత్నాఢ్యాయై | ,, |
| ,, | రంభాదిపూజితాయై | ,, | ,, | రాగరూపాయై | ,, |
| ,, | రమ్యరామానందప్రదాయిన్యై | ,, | ,, | రాగాతీతాయై | ,, |
| ,, | రత్నహారాయై | ,, | ,, | రాగిణ్యై | ,, |
| ,, | రాజమునిస్తుత్యాయై | ,, | ,, | రత్నమవిద్ధమాల్యాయై | ,, |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఓం | రత్నపర్యంకశాయిన్యై | నమః | ఓం | రావణజ్ఞానకోటిన్యై | నమః |
| " | రత్నాసనస్థితాయై | " | " | రాజంత్యై | " |
| " | రాజద్రత్నస్థగితపాదుకాయై | " | " | రాజభృత్యాయై | " |
| " | రతిరాజస్తుతాయై | " | " | రాక్షసౌఘవినాశిన్యై | " |
| " | రమ్యాయై | " | " | రాజానుజాయై | " |
| " | రుక్మాంగదసుపూజితాయై | " | " | రంగరాజమహిష్యై | " |
| " | రణరంగప్రియాయై | " | " | రంగనాయికాయై | " |
| " | రత్నదాయిన్యై | " | " | రాజితాయై | " |
| " | రాక్షసీస్తుతాయై | " | " | రమణ్యై | " |
| " | రాకేందువదనాయై | " | " | రామాయై | " |
| " | రామభక్తసౌభాగ్యదాయిన్యై | " | " | రామచిత్తానుసారిణ్యై | " |
| " | రంగద్వారపురీరమ్యాయై | " | " | రాజ్యకర్త్ర్యై | " |
| " | రాజదర్పాపహారిణ్యై | " | " | రమ్యరూపాయై | " |
| " | రంగదాసార్చితపదాయై | " | " | రమ్యపుష్పవిభూషితాయై | " |
| " | రఘువంశకథారతాయై | " | " | రాజ్యశ్రియై | " |
| " | రంగరాజపురాంతస్థాయై | " | " | రాజ్యరూపాయై | " |
| " | రంగరాజసుఖప్రదాయై | " | " | రణత్కింకిణిమేఖలాయై | " |
| " | రంగేశ్వర్యై | " | " | రాజీవలోచనాయై | " |
| " | రాజముఖ్యై | " | " | రాధాయై | " |
| " | రణన్నూపురభూషణాయై | " | " | రాజ్ఞ్యై | " |
| " | రాజరాజార్చితపదాయై | " | " | రమ్యగుణాశ్రయాయై | " |
| " | రాజద్గంధేభవాహనాయై | " | " | రాజీవపాదాయై | " |
| " | రాజరాజాదిసంస్తూయమానాయై | " | " | రాజీవహస్తాయై | " |
| " | రాజ్యప్రదాయిన్యై | " | " | రాజీవధారిణ్యై | " |
| " | రాజరాజేశ్వరీవంద్యాయై | " | " | రామభక్తార్చితపదాయై | " |

| | | | |
|---|---|---|---|
| ఓం రాజన్మకుటమండితాయై | నమః | ఓం రుద్రార్చితపదాయై | నమః |
| „ రామపాదాశ్రితాయై | „ | „ రంగనగరాంతర్విహారిణ్యై | „ |
| „ రామవామాంకస్థాయై | „ | „ రుద్రాదిదేవసందోహ | „ |
| „ రంజితాయై | „ | „ సమర్చితపదాంబుజాయై | „ |
| „ రామప్రియాయై | „ | „ రుద్రబ్రహ్మాదిసంసేవ్యాయై | „ |
| „ రాజ్యలక్ష్మ్యై | „ | „ రుక్మమాలావిభూషితాయై | „ |
| „ రాకాచంద్రనిభావనాయై | „ | „ రోగసంఘవినిర్మూలాయై | „ |
| „ రామానుజస్తుతాయై | „ | „ రుజాహంత్ర్యై | „ |
| „ రామభక్తాయై | „ | „ రుక్మదాయై | „ |
| „ రమ్యవరప్రదాయై | „ | | |
| „ రాక్షసీరక్షణవ్యగ్రాయై | „ | ఓం శ్రీ మద్భావపురీవాస | |
| „ రుద్రాణ్యాదిసమర్చితాయై | „ | రాజ్యలక్ష్మ్యైనమోనమః | |



ఓం నమోభావనారాయణాయ నమః

# శ్రీ భావనారాయణ అష్టోత్తర శతనామ స్తోత్రమ్

ధ్యానం;-

శ్రీభావదేవ మభయప్రదమబ్జహస్తం
చండాంశుకోటిరుచిరోజ్జ్వలతీక్ష్ణచక్రం
సోమప్రకాశ జలజం కటిమధ్యపాణిం
వందే రమావసుమతీ సహితం సురేశమ్॥

శ్రీ మహీభ్యాంచ సహితం శ్రీవత్సమణిభూషణం
భావనారాయణం దేవం భజేభావపురీశ్వరమ్॥

శ్లో॥ భగవాన్ భవ్యదాతా చ భాగ్యదో భద్రకారకః
భక్తరక్షణభావార్థో బృందాచిత్తాపహారకః॥ 1

,, భక్తలోకమనోహారీ భక్తలోకవరప్రదః
భక్తామరక్తో భక్తేశో భక్తలోకసుఖప్రదః॥ 2

,, భక్తార్తినాశనో భావపత్తనస్థో బలానుజః
భర్గజేశా భవాత్మా చ బహుబ్రహ్మాండనాయకః॥ 3

,, భవబ్రహ్మాదిదేవేశో భవసాగరతారకః
భార్గవో భృగునిర్ణీతపరత్వో భామమధ్యగః 4

,, భావనారాయణో భర్గవరదో భక్తవత్సలః।
భావపట్టణవాసీ చ భూసురప్రీతికారకః॥ 5

,, భావప్రపంచనిలయో భావచక్రప్రవర్తకః
భావగర్భో భూమినాథో భవబంధవిమోచకః॥ 6

,, భాసకో భాస్కరో భామః బాణబాహువిదారకః।
భాస్కరార్చితపాదాబ్జో భామచంద్రసులోచనః॥ 7

,, భాన్వద్రత్నకిరీటీ చ భూసురో భూతిదాయకః।
భీమో భ్రాతృహితో భీష్మో భీష్మకైవల్యదాయకః 8

,, భీకరఘ్నో భీష్మరూపో భీషణాకారశక్తియుక్।
భూషాభూషితసర్వాంగో భూనభోంతరవిక్రమః॥ 9

,, భూభారహరణో భూమియాచకో భూసురార్చితః।
భూదేవరక్షణవ్యగ్రో భూతానామభయప్రదః॥ 10

,, భూమీరుహసుజాతశ్చ భాగ్యలక్ష్మీమనోహరః।
భృగుపూజితపాదాబ్జో భార్గవీశో భయాపహః॥ 11

శ్లో॥ భృగుపత్నీ ప్రాణహారీ భృగుపుత్రీమనోహరః
బాణకోదండహస్తశ్చ భావాతీతో బృహద్రథః॥ 12

,, బటురూపధరో భూపరక్షకో బంధమోచకః
బలరామామజశ్చాపి భేషజో భిషగాత్మకః॥ 13

,, బలిశిరస్థపాదాబ్జో బాలరూపో భవప్రియః
బాలగోపాలరూపశ్చ బాలక్రీడాపరాయణః॥ 14

,, బాలకృష్ణస్వరూపశ్చ బాలభామస్వరూపవాన్।
బాలక్రీడాసక్తచిత్తో బాలగ్రహవినాశకః 15

,, బాణప్రయోగనిపుణో భామభాసురవిగ్రహః।
బంధురారణ్యమధ్యస్థక్షీరభూజోద్భవో భవః॥ 16

,, బంధుభూతో భవ్యరూపో భావుకేశో బలాధికః।
బృందావననివాసీ చ బృందాదేవీసమర్చితః॥ 17

,, బ్రహ్మకృత్యాను రక్తశ్చ బృహత్సింధురగోచరః।
బ్రహ్మాండగర్భో బ్రహ్మణ్యో బ్రాహ్మణో
బ్రహ్మమూర్తిమాన్॥ 18

,, బ్రహ్మాంతరాత్మా బ్రహ్మాత్మా భవఘ్నో భ్రాతృవత్సలః
బ్రహ్మాదిదేవనిర్ధ్యాతో బ్రహ్మాండానాం ప్రవర్తకః॥ 19

,, బ్రహ్మస్వరూపీ బ్రహ్మాత్మా బ్రహ్మస్వవినివారకః
బ్రహ్మగమ్యో బ్రహ్మవేద్యో బ్రహ్మశత్రువిభేదకః॥ 20

,, బ్రహ్మవిద్ బ్రహ్మరూపశ్చ బ్రహ్మజ్ఞానప్రబోధకః।
శ్రీ భావనగరాధీశ నారాయణ నమోస్తుతే॥ 21

,, ఇతీదం భావదేవస్య నామ్నామష్టోత్తరం శతమ్॥
భయాపహం భవఘ్నం చ పుత్రపౌత్రాభివర్ధనమ్॥ 22

,, ఆయురారోగ్యదం సంపత్కీర్తిదం చ సుఖావహమ్।
త్రిసంధ్యం యః పఠేన్నిత్యం సర్వకామఫలప్రదమ్॥ 23

,, భావనారాయణాధీశ ప్రసాదాత్పరమోత్తమాత్
సర్వాన్కామానవాప్యైవ హ్యంతే మోక్షమవాప్నుయాత్ 24

శ్రీ భావనారాయణాష్టోత్తర శతనామస్తోత్రమ్ సంపూర్ణమ్

హరిః ఓమ్ తత్సత్.

# శ్రీ భావనారాయణాష్టోత్తర శతనామావళిః

| | | | |
|---|---|---|---|
| ఓం భగవతే | నమః | ఓం భక్తలోకసుఖప్రదాయ | నమః |
| ఓం భవ్యదాత్రే | ,, | ఓం భక్తార్తినాశనాయ | ,, |
| ఓం భాగ్యదాయ | ,, | ఓం భావపత్తనస్థాయ | ,, |
| ఓం భద్రకారకాయ | ,, | ఓం బలామజాయ | ,, |
| ఓం భక్తరక్షణభావాఢ్యాయ | ,, | ఓం భర్గజేత్రే | ,, |
| ఓం బృందాచిత్తాపహారకాయ | ,, | ఓం భవాత్మనే | ,, |
| ఓం భక్తలోకమనోహారిణే | ,, | ఓం బహుబ్రహ్మాండనాయకాయ | ,, |
| ఓం భక్తలోకవరప్రదాయ | ,, | ఓం భవబ్రహ్మాదిదేవేశాయ | ,, |
| ఓం భక్తామరక్తాయ | ,, | ఓం భవసాగరతారకాయ | ,, |
| ఓం భక్తేశాయ | ,, | ఓం భార్గవాయ | ,, |

| | | | |
|---|---|---|---|
| ఓం భృగువిదీర్ణతపరశ్వాయ | నమః | ఓం భీకరఘ్నాయ | నమః |
| ఓం భామమధ్యగాయ | ,, | ఓం భీష్మరూపాయ | ,, |
| ఓం భావనారాయణాయ | ,, | ఓం భీషణాకారశక్తియుజే | ,, |
| ఓం భగ్గవరదాయ | ,, | ఓం భూషాభూషితసర్వాంగాయ | ,, |
| ఓం భక్తవత్సలాయ | ,, | ఓం భూనభోంతరవిక్రమాయ | ,, |
| ఓం భావపట్టణవాసినే | ,, | ఓం భుభారహరణాయ | ,, |
| ఓం భూసురప్రీతికారకాయ | ,, | ఓం భూమియాచకాయ | ,, |
| ఓం భావప్రపంచనిలయాయ | ,, | ఓం భూసురార్చితాయ | ,, |
| ఓం భావచక్రప్రవర్తకాయ | ,, | ఓం భూదేవరక్షణవ్యగ్రాయ | ,, |
| ఓం భావగర్భాయ | ,, | ఓం భూతానామభయప్రదాయ | ,, |
| ఓం భూమినాథాయ | ,, | ఓం భూమీరుహసుజాతాయ | ,, |
| ఓం భవబంధవిమోచకాయ | ,, | ఓం భాగ్యలక్ష్మీమనోహరాయ | ,, |
| ఓం భాసకాయ | ,, | ఓం భృగుపూజితపాదాబ్జాయ | ,, |
| ఓం భాస్కరాయ | ,, | ఓం భార్గవీశాయ | ,, |
| ఓం భానవే | ,, | ఓం భయాపహాయ | ,, |
| ఓం భాణబాహువిదారకాయ | ,, | ఓం భృగుపత్నీప్రాణహారిణే | ,, |
| ఓం భాస్కరార్చితపాదాబ్జాయ | ,, | ఓం భృగుపుత్రీమనోహరాయ | ,, |
| ఓం భానుచంద్రసులోచనాయ | ,, | ఓం బాణకోదండహస్తాయ | ,, |
| ఓం భాస్వద్రత్నకిరీటినే | ,, | ఓం బావాతీతాయ | ,, |
| ఓం భూసురాయ | ,, | ఓం బృహద్రథాయ | ,, |
| ఓం భూతిదాయకాయ | ,, | ఓం బటురూపధరాయ | ,, |
| ఓం భీమాయ | ,, | ఓం భూపరక్షకాయ | ,, |
| ఓం భాతృహితాయ | ,, | ఓం బంధమోచకాయ | ,, |
| ఓం భీష్మాయ | ,, | ఓం బలరామానుజాయ | ,, |
| ఓం భీష్మకైవల్యదాయకాయ | ,, | ఓం భేషజాయ | ,, |

| | |
|---|---|
| ఓం భిషగాత్మకాయ నమః | ఓం బ్రహత్సింధురగోచరాయ నమః |
| ఓం బలిశిరస్థపాదాబ్జాయ „ | ఓం బ్రహ్మాండగర్భాయ „ |
| ఓం బాలరూపాయ „ | ఓం బ్రహ్మణ్యాయ „ |
| ఓం భవప్రియాయ „ | ఓం బ్రాహ్మణాయ „ |
| ఓం బాలగోపాలరూపాయ „ | ఓం బ్రహ్మమూర్తిమతే „ |
| ఓం బాలక్రీడాపరాయణాయ „ | ఓం బ్రహ్మాంతరాత్మనే „ |
| ఓం బాలకృష్ణస్వరూపాయ „ | ఓం బ్రహ్మేశాయ „ |
| ఓం బాలభానుస్వరూపవతే 78 „ | ఓం భవఘ్నాయ 88 „ |
| ఓం బాలక్రీడానక్తచిత్తాయ „ | ఓం భక్తవత్సలాయ „ |
| ఓం బాలగ్రహవినాశకాయ „ | ఓం బ్రహ్మాదిదేవనిర్ధ్యాతాయ „ |
| ఓం బాలప్రయోగనిపుణాయ „ | ఓం బ్రహ్మాండానాంప్రవర్తకాయ „ |
| ఓం భామభామరవిగ్రహాయ „ | ఓం బ్రహ్మస్వరూపిణే „ |
| ఓం బంధురారణ్యమధ్యస్థ | ఓం బ్రహ్మణే „ |
| క్షీరభూజోద్భవాయ „ | ఓం బ్రహ్మస్త్రవివారకాయ „ |
| ఓం భవాయ „ | ఓం బ్రహ్మగమ్యాయ „ |
| ఓం బంధుభూతాయ „ | ఓం బ్రహ్మవేద్యాయ „ |
| ఓం భవ్యరూపాయ „ | ఓం బ్రహ్మశత్రువిభేదకాయ 108 „ |
| ఓం భావుకేశాయ „ | ఓం బ్రహ్మవిదే „ |
| ఓం బలాధికాయ „ | ఓం బ్రహ్మరూపాయ „ |
| ఓం బృందావననివాసినే „ | ఓం బ్రహ్మజ్ఞానప్రబోధకాయ „ |
| ఓం బృందాదేవీసమర్చితాయ „ | ఓం నమో శ్రీ శేషనగరాధీశ |
| ఓం బ్రహ్మకన్యామరక్తాయ „ | నారాయణాయ నమః |

ఓమ్ శ్రీమైనమః

# శ్రీ మదాంజనేయాష్టోత్తర శతనామ స్తోత్రమ్

ఓం శ్రీగురుభ్యోనమః హరిః ఓం

ధ్యానం:-

అంజనానందనంవీరం జానకీశోకనాశనం
కపీశమక్షహన్తారంవందే లంకాభయప్రదమ్ 1

అంజనేయ మతిపాటలాననమ్
కాంచనాద్రికమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం।
భావయామి పవమాననందనమ్॥ 2

యత్రయత్ర రఘునాథ కీర్తనం।
తత్రతత్ర కృతమస్తకాంజలిం।
బాష్పవారి పరిపూర్ణ లోచనం।
మారుతిం నమత రాక్షసాంతకమ్॥ 3

మనోజవం మారుతతుల్యవేగమ్।
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం।
వాతాత్మజం వానరయూధ ముఖ్యం।
శ్రీరామదూతం శిరసా నమామి॥ 4

ఉల్లంఘ్య సింధోస్సలిలం సలీలం।
యశ్శోకవహ్నిం జనకాత్మ జాయాః
ఆదాయతేనైవ దదాహ లంకాం।
నమామి తం ప్రాంజలిరాంజనేయమ్॥ 5

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసం।
రామాయణ మహామాలా రత్నం వన్దేఽనిలాత్మజమ్॥ 6

అమిషీకృత మార్తాండం గోష్పదీకృత సాగరమ్।
తృణీకృత దశగ్రీవం ఆంజనేయం నమామ్యహమ్॥
శ్రీరామసందేశ హరప్రవీరః।
సీతాసతీశోక వినాశదక్షః।
పౌలస్త్యగర్వద్రుమ భంజనోత్కః।
శ్రీరామదూతోఽవతు మాంహరీశః॥
సుగ్రీవరాజ్యాగమ హేతుభూతమ్।
సింధోస్సు ముల్లంఘన కార్యశూరం॥
సీతాపదాన్వేషణ దీక్షబుద్ధిం।
ధ్యాయామ్యహం వానరయూధ ముఖ్యమ్॥
ఆంజనేయం మహావీరం హనుమంతం మహామతిమ్।
వాయుపుత్రం మహాశక్తిం వన్దేవానర నాయకమ్॥

స్తోత్రం :

ఆంజనేయోఽప్రమేయాత్మా హ్యనన్తో హ్యమరేశ్వరః।
అణురూపోఽనన్త రూపో హ్య ప్రమత్తోఽంగద ప్రియః 1
ఆత్మవానతి విజ్ఞాతా హ్యనందాఽఽత్మాఽభయప్రదః।
అతివీరో హ్యక్షతశ్చాఽనందరూపోఽతి మంగళః॥ 2
అదృశ్యోఽమిత పుచ్ఛశ్చాఽప్యవ్యక్తోఽమిత శక్తిమాన్।
అయోనిజో హ్య శ్రమస్థో హ్య ధృష్టో హ్యభి రామకః॥ 3
అర్కబింబ ఫలగ్రాహీ హ్యర్కశిష్యోఽచ్యుతోఽవ్యయః।
అర్థదో హ్యష్టమూర్తిశ్చ హ్యనపాయీ హ్యనా కులః॥ 4
అసురారిప్రియోఽక్రూరో హ్యద్భుతో హ్య పరాజితః।
అచలోద్ధారకోఽనర్థహారీ హ్యత్మ విశారదః॥ 5

